# గోలకొండ పత్రిక

స్వభాను సం॥ర ఆశ్వీజ బ॥ ౮ గురువారము

## జమా ఖర్చు విశేషాలు

హైదరాబాదు రాష్ట్రపు ఆయవ్యయపట్టికలో యుద్ధానంతర సర్దుబాట్లకు కొంత అవకాశ మేర్పాటు చేసినామని తెలిపినారు. ఇంగ్లాండు అమెరికావంటి స్వతంత్ర సామ్రాజ్యాలకు యుద్ధానంతర ప్రణాళికలు కావలెను. మన దేశాని కేమి ప్రణాళికలుండును? అందులో హైదరాబాదుకు అట్టి వవసరమా? అప్పుడే మనరాష్ట్రములో ఒక ప్రత్యేక యుద్ధానంతర ప్రణాళికశాఖను పెద్ద జీతాలఅధికార్లతో ఏర్పాటుచేసినారు. ఈ మధ్య మనరాష్ట్రములో కొత్తకొత్త కచ్చేరీలు చాలా ఏర్పాటైనవి. కొత్త కొత్త బెంకులేర్పాటయినవి. ఇంకా చాలాచాలా కానున్నవి. ఖర్చులు కూడా ఎక్కువకాగలవు. అయితే దానిని సరిపెట్టుకోవచ్చును. అవి బజెటులో ధ్వని ప్రధానమైన ఒక సువర్ణ వాక్యాన్ని ఇట్లు వ్రాసినారు.

> "జాతి నిర్మాణ కార్యక్రమముపై ఎక్కువ వ్యయము కానున్నది. అందుచేత కొంత సర్దుబాటు యుద్ధానంతరము చేయవలసి యుండును. కాని రాష్ట్రీయ ఆర్థిక వ్యవస్థ దిట్టముగా ఉన్నది. ఇంకా కొత్తపన్నులను విధించుటకు మంచి అనుకూలాలున్నవి. అభివృద్ధి కొరకై మందు ప్రభుత్వము అట్టి టేని విధించవచ్చును."

ఈ వాక్యాలభావాలను సూక్ష్మగ్రాహులు అర్థము చేసుకొనగలరు.

ఈ సంవత్సరము వేసిన కొత్త పన్నులలో అధిక లాభాలపన్ను ముఖ్యమైనది. అది గత సంవత్సరమే రావలసియుండెను. దానికిగత కాలంపై అధికార ముందోలేదో తెలియదు. దానిలో యేవోమార్పులు చేసినామనియు అవి ప్రత్యేకముగా తెలుపుదుమనియు చెప్పినారు. ఎట్లయితేనేమి అ. లా. పన్ను వేయుటలో మంచిపని చేసినారు. ఆదిలో వ్యాపార మండలివారిని దాని కొప్పుకొనుదయ్యా అని అర్థించగా ఊహూ అని మూతి బిగించుకొనిరి. ఇప్పుడు మ. ఘ. వ. ప్రభువుగారి అంగీకారమును పొందిన తర్వాత అదే మండలివారు శాసనం బాగుంది బాగుంది అని ప్రశంసించుచున్నారు. వారిలో ఎంత త్వరగా విజ్ఞానప్రకాశమైనదో చూచితిరా! కాలమహిమ అంటే ఇట్టిదే చూడండి !!

ఈ సంవత్సరములో వేసిన రెలవ కొత్తపన్ను పొగాకు పన్ను. దానినుండి ౭౫ లక్షలు వచ్చునట. ఇది మంచిపన్ను. కల్లులోవిటమిను ఉన్నదని సైన్సువేత్త లనుచున్నారు. కాని పొగాకులో ఏమన్నీ లేవనియు ఇంతటి నిరుపయోగకారి, నష్టకారి ఇంకొకటి లేదని శిష్టులంతా అంగీకరించినారు. అట్టి దానిపైన ఎంతపన్ను వేసినను వద్దనము. రైతులకు గిట్టుబాటైతే దానిని ముందు పండింతురు. గిట్టకుంటే వదలుకొంటారు. అఖిలభారత ప్రభుత్వము వారు పొగాకును ఎచ్చటను పండించవలదని శాసించితే మరీబాగుంటుంది. ఎక్కువ వంకాయలేకాక ఎక్కువకూరనాయల నన్నింటిని, ఎక్కువ తిండిధాన్యాలనన్నింటిని పండించవచ్చును. ఈ పొగాకుపన్ను రైతులకు ఇబ్బంది కలిగించునని అభిప్రాయపడుదుము. వ్యాపారులవద్దకాక రైతులవద్ద ఏ నేల్ల కంటె ఎక్కువగానుండు పొగాకుపై కొత్తగా నియుక్తులైన పొగాకుపన్నులను విధింతురు. రైతులకు అవస్థలుకలుగును. అప్పుడే అమీనులు చేలపైవెళ్ళి ఎంత పొగాకు వేసినారు అని లెక్కలు వ్రాసికొని పోవుచున్నారని తెలిసినది. ఒకరిద్దరు యీపీడ మాకెందుకు అని చేలపైనున్న పొగాకు మొలకలను పీకి వేయించినారట!

ఈ సంవత్సరము చేసేవ్యయములో విద్యపై ౧ కోటి ౪౦ లక్షలు ఖర్చుచేయుచున్నారు. అనగా గత సంవత్సరముకంటే ఇంచుమించు ౪౭ లక్షలు ఎక్కువ వ్యయము చేయుచున్నారు. ఇది శుభశకునముగా నున్నది. విద్యకై ఎట్లెట్లువ్యయము చేయుదురో ఆవివరాలుకూడా తెలిపినారు. అవి కూడా పసందుగానేవున్నవి. ఇప్పుడు విద్యాశాఖాధ్యక్షులుగా ఏర్పడినట్టి మహమ్మద్ అజంగారు ఉత్తమోత్తములు. పదహారణాలముల్కీ పన్నెండు మాసాల రాష్ట్రీయుడు. సర్వవిధాలా ప్రేమపాత్రుడు. హిందూముస్లింభేదాలను పాటించువారు కారని విన్నాము. అట్టివారి యధ్వర్యములో ప్రపంచములో ఏ దేశమందునులేనట్టి చిక్కులతో అల్లిబిల్లిగా అల్లుకొనిపోయిన మనవిద్యాసమస్యలు అందరికిని అనగా హిందూ ముస్లిములకున్నూ, ఉర్దూ, హిందీ, మరాటీ తెనుగు,కన్నడీప్రజలకును తృప్తికరంగా పరిష్కారము కావచ్చునని ఆశించుచున్నాము. అట్టి సుదిన మెప్పుడువచ్చునోయేమో?

బజెటులో ఒక ముఖ్యమైనసూచనను చేసినారు. అదేమనగా "ఇనుము ఉక్కు కరువైనందున రైతులకు వ్యవసాయింపనిముట్లకు ఇబ్బంది కలిగినందులకు ప్రభుత్వానికి ఆందోళన కలిగినది. అందుచేత బ్రిటిషిండియా ప్రభుత్వాన్ని అర్థించి రాష్ట్రీ వ్యవసాయికులకు అవసరమగు ఉక్కు ఇనుము తెప్పించి రైతులకు అనుకూలమగు ధరల కిచ్చి ఎక్కువ పండించండి, అను ప్రచారానికి తోడ్పడు ఆలోచనను చేయుచున్నాము" ఇది సువార్త. రైతుకు ఈ లోహములు చాలా అవసరము-మన ప్రభుత్వమువారు పైవిషయములలో ఆలోచన చేయుచున్నారు అని తెలిపినారు. వారిపుణ్యము. ఆలోచనలో ఆలస్యముచేయక వెంటనే వ్యవహారము సాగించి తొందరగా తెప్పించి పంచిపెట్టితే అనుగ్రహముగా ఉంటుంది.

యుద్ధానంతరము ఆర్థికాభివృద్ధికిగాను ఇంగ్లాండునుండి మెషినరీ తెప్పించు ఏర్పాట్లుచేయుచున్నామని తెలిపినారు.- ముందుకాలములో పరిశ్రమలకే ముఖ్యస్థానము భారతదేశములో నుండగలదు. అందుకుగాను యంత్రాలు అవసరమే. పైగా యీ యుద్ధకాలంలో ధనికులవద్ద వ్యాపారులవద్ద అపారము గా ద్రవ్యము నిలువ యుండిపోయినది. వారికి దానితో ఏమిచేయవలెనో తెలియనిస్థితి ఏర్పడినది. వారు ఆ ద్రవ్యాన్ని తప్పకుండా పరిశ్రమలలో వినియోగింతురు. కాని పరిశ్రమలు సహజసిద్ధముగా వృద్ధికివచ్చునట్లు ప్రభుత్వమువారు చూడవలెను అసహజమైన "మొనాపలీ" అనుపద్ధతియుండరాదు. మొనాపలీపద్ధతి వలన దేశమందుభిన్న భావాలు ఏర్పడ అభివృద్ధికి నిరోధకమగును.

మొత్తముపై ఈ సంవత్సరం బజెటు అపూర్వమైనదనియు, ఇంతవరకేర్పాటైయుండిన వాటిలోనెల్లను ఉత్తమమైనట్టిదనియు అభిప్రాయ పడుచున్నాము.

## ఇండియాకు తిండి నొసగెదమని జపాను వారనుట

బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో అక్టో ౧౯ వ తేదిన ప్రశ్నలసమయమందు జపానువారు ఇండియాకు తిండినొసగెదమని రేడియోలో చెప్పినమాటలనుగురించి ఒక ప్రశ్న అడుగబడినది. దానికి అమెరీగారు జపానువారిమాటలు కేవలము ఆకర్షణకొరకేననియు, ఆమాటలను ప్రచురణచేయుటకేమ కష్టము కాదనియు సమాధానమిచ్చిరి.

బెంగాలులోనూరము ౧ కి వేయిమంది మరణించుచున్నట్లు తనకు తెలియవచ్చినదనియు, కాని ఆలెక్క ఇంకను ఎక్కువగానే ఉండవచ్చుననియు అమెరీగారు చెప్పిరి.

గాంధీగారినుండిగాని, మరియేకాంగ్రెసు నాయకునినుండి వైస్రాయిగారికిగాని, సర్ రెజినాల్డుమాక్స్వెల్ గారికిగాని, ఇండియా ప్రభుత్వము గారికిగాని ౧౯౪౨ ఆగష్టు ౮ తేదినాటి కాంగ్రెసుతీర్మానమును గురించి పంపించబడినలేఖలోని విశేషములను తెలిపెదరాయనియు, ఇప్పటిపరిస్థితులలో శాసనోల్లంఘనమును చేయుటలేదని కాంగ్రెసువారు చెప్పినారాయనియు అమెరీగారిని ప్రశ్నించగా, వారిట్లు చెప్పిరి: "ఉపవాసముతర్వాత గాంధిగారితో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరము లనుగురించి నేను జూలై ౧౯ వ తేది నాడు చెప్పినదానికంటె ఎక్కువ ఏమియుచెప్పవలసినఅవసరము లేదు. ఇపుడునిర్బంధములోనున్న ఇతర కాంగ్రెసునాయకులనుండి పంపించబడిన లేఖలనుగురించిఅడిగిన ప్రశ్నకును ఇదియేజవాబు. ప్రశ్నలోని రెండవభాగమును తెలిపినసూచనవంటిది ఏదిగాని జెయిలులలోనుంచబడిన కాంగ్రెసునాయకులవద్దనుండిగాని చేరియుండలేదు."

అమెరీగారు జూలై ౧౯ తేదినిచ్చినసమాధానమందు లేఖలసంఖ్యనుగాని, వాటిలోనిసంగతులనుగాని తెలుపజాలమని యుండిరి.

## ఉచిత రాత్రి పాఠశాల- హైటెక్ బస్తీ సికింద్రాబాదు

ఈపైసంస్థస్థాపితమై దాదాపు రెండు మాసములు కావచ్చినవి. ముఖ్యముగా పగలంతయు పనిపాట్లచే తీరిక లేనివారికి విద్యలేని లోపము నివారించుటకుగాను ఏర్పరచబడిన రాత్రిపాఠశాల. ఇప్రస్తుతము ౫౦మందిబాలురకు, ఐదుగురు యువకులకు ఉచితవిద్యా దాన మొసంగుచున్నది. దీని అభివృద్ధిపరుపవలెననవ్యవస్థాపకులగు శ్రీయుత, ఎ.బి.సుబ్రహ్మణ్యశర్మగారిచే నొక సభ ఆదివారం ౭౯-౧౦-౪౩ తేదిరియగు స్వభానునామ సం॥ ఆశ్వీజశుద్ధపంచమి సాయంత్రము నేర్పాటు గావింపబడెను. ఉపాధ్యాయులుగు ప్రముఖుల పెక్కండ్రా సభకు విచ్చేసిరి. శ్రీయుత అనంతుల రంగపాండుగారు అధ్యక్షపదవినలంకరించిరి. వ్యవస్థాపకుడు పాఠశాలయొనర్చుచున్న ఉచిత విద్యావ్యాప్తిని క్లుప్తముగా వివరించినతదుపరి, శ్రీయుత దత్తాత్రేయశర్మగారు యిట్టి విద్యాలయముల అవసరమును తెల్పుచు, దీనికి సానుభూతిచూపుచున్నవారినభినందించుచు, యిట్టిదానికి ఒకఉపాధ్యాయుడేగాక యిద్దరుముగ్గురు అవసరమనియు, కార్యనిర్వాహకులు తప్పనిసరిగా దీనికిఒక తమూలధనమునుసాలు చేసి వేతనముపై ఉపాధ్యాయుని నేర్పాటుచేయుటవసరమని నొక్కి వక్కాణించిరి.

ఆపై పైవిద్యాలయమునకు కార్యనిర్వాహకవర్గము ఎన్నుకొనబడెను.

## ఆంధ్ర భవన నిర్మాణము

ఆంధ్రభవన నిర్మాణముకొరకు చేయబడుచున్న కృషి దశమాంధ్రమహాసభలో అంగీకరించబడిన తీర్మానముపై ఆధారపడి యున్నది. అవసరమైన వివరములు దానిలో గలవు. అంతకుమించిన వివరణము ఇప్పుడు అప్రస్తుతమనిపించుచున్నది.

దూరదృష్టితో చూచినవారికి ఆంధ్రభవననిర్మాణకార్యము, "ఒక ఆంధ్రుని" లేఖలో చూపబడిన తక్కినఆన్ని కార్యములకంటె ఎక్కువగా అవసరమైనదిగాను, 'సంకుచితము'కానిదిగాను కనుపడునని నావిశ్వాసము.

ఈవిషయమున "ఒక ఆంధ్రుడు"గారు భ్రమయనక నాతో కలిసికొనినపక్షమున వారి అనుమానములు తొలగగలవని నమ్ముచున్నారు.

వెంకటరంగారెడ్డి
అధ్యక్షులు.

## మునిసిపాలిటీ రద్దు!

హైద్రాబాదుప్రభుత్వమువారు నగరకార్పరేషనురద్దుచేయుచు ఈక్రిందివిధముగా ప్రకటించుచున్నారు —

గతసంవత్సరము ఇంతలో కొత్తమునిసిపల్ శాసనంరానున్నదికదా అని ము-ఘు-వ వారి ఫర్మానుద్వారా ఇప్పటిసభ్యులకాలాన్ని ఒకసంవత్సరంపొడిగించిరి. కాని యింకాకొంత ఆలస్యము కానున్నది. ఇంతవరకు మూడేండ్లకాలము ఎక్కువగా యిప్పటిసభ్యులకాలము పెంచ్చింపబడెను. మునిసిపాలిటీలో లోపాలుకనబడినవి. వాటిని సవరించవలెను అందుచేతయిక పొడిగించుట అనవసరమనిపించినది. అందుచేత ము-ఘు-వ నిజాంగారి ఫర్మానుద్వారా యిట్లాజ్ఞాపింప బడుచున్నది—

(౧) ౧౯౪౪ జూలై ౨౯నుండి సభ్యులకాలం పరిసమాప్తి చేయబడినది. కొత్తశాసనంవచ్చువరకు కొత్త ఎన్నికలు కావు-

(౨) మునిసిపాలిటీకి ఒకవిచారణకర్త (అడ్మినిస్ట్రేటర్) నియమింపబడుచున్నాడు. అతడురారు పార్యన్నుచందు. అతడెలు పనిచేయును. అతనికి ౧౨ మంది సలహాదారులుందురు.

## తిండిపెట్టలేక తండ్రి బిడ్డలనుచంపుట

గోరఖ్పూరు, అక్టోబరు ౧౮

కైసానిదానియగు రంజాన్ అనునతడు తనబిడ్డలనుతిండిపెట్టజాలక చంపివేసినాడు. ఇట్లుఒకముగ పిల్లవాడు ఒకఆడపిల్లచచ్చినారు. పారతోచంపెను-ఆబిడ్డలుతల్లినిఅన్నమడిగిరి. తల్లివారలనుతండ్రివద్దకుపొమ్మనెను. తండ్రికోపంతో మొకటకొడుకును తర్వాతకూతురునిచంపెను. తానుఅన్నము పెట్టలేక అట్లాచేసితినని తాప్రిపోలీసులవద్ద ఒప్పుకొనెను.

బాకారీలో ఒకవృద్ధుడుతనబిడ్డలకు అన్నముపెట్టలేక ఆత్మహత్యచేసికొనెను.

ఒకస్త్రీకనబిడ్డను రు ౧.లకు అమ్మివేసెను. ఇందుకుకారణము తెలియుటలేదు. యు-ప్రె

## న్యూయార్కులో బొంబాయి సైంటిస్టు

న్యూయార్కులో డాక్టరు వామన రామచంద్రకోకటూన్నరులను భారతీయరసాయన శాస్త్రవేత్త అమెరికా సంయుక్తరాజ్య ప్రభుత్వమువారు యుద్ధమునకుసంబంధించిన రసాయనశాస్త్రవిషయములను పరిశోధించుటకైఏర్పాటుచేసిన శాఖలో కష్టశాఅధికారములోనుండి పరిశోధనలు జరుపుచున్నారు, వీరుపనిచేసేపరిశోధనాగారములో భారతీయశాస్త్రవేత్తలు పలువురుఅనేక రహస్యవిషయములను పరిశోధనచేయుచున్నారు. అమెరికాలో ప్రభుత్వమునకు సలహానిచ్చుగొప్పపసిద్ధులలో డాక్టర్ కోకటూన్నరుగారొకరు-వీరిపేరుఫ్రాన్సు,ఇటలీ ఇంగ్లాండు, ఆర్జెంటైనా, ప్రేజిల్ రాజ్యాలలో కూడ ప్రసిద్ధమైయున్నది కోకటూన్నరుగారుభారతదేశమందు బొంబాయిరాష్ట్రములో జన్మించినట్టివారు. శ్రోత్రశాస్త్రరహస్యములను కనుగొనిబయటపెట్టినటులలో గొప్పప్రతిభాశాలియని వీరిని అమెరికాసంయుక్తరాజ్యపు పేటెంటుఆఫీసుయొక్క ఒకఉత్సవము గిరాలంలోజరిగినపుడు అభినందించియుండిరి. ఆదేవిధముగనే న్యూయార్కులో జరిగినప్రపంచపుసంతయందుకూడ గౌరవించిరి.

వీరినిఈమధ్యఒక పత్రికవిలేఖరుడు దర్శించి మాట్లాడినపుడు వీరుఈయుద్ధములో రసాయనశాస్త్రమందు కనుగొన్నవిషయములచే అధికముమనుష్యులకుచచ్చుటకంటె బ్రతుకుట్లో తెలియగలదనిచెప్పిరి.

## ఇండియా, చైనా, రష్యాల ప్రాముఖ్యము

### అమెరికను అభిప్రాయము

పెరల్ యస్-బక్అను అమెరికను, ఈక్రిందిఅభిప్రాయమును ప్రకటించెను-

అమెరికనులు ఇతరజాతులవిషయములో ఎప్పుడుపక్షపాతముతోఉండేవారు పాతభావముల ప్రకారం, వ్యవహరించుచువచ్చినారు. ఇప్పుడుఅమెరికనులందరును చైనీయులయెడ ఆకర్షించబడుచున్నారు, వారలిపుడు భారతదేశప్రజలయెడ ఉత్సుకులుగానున్నారు-ఇతరజాతులతో ఆనందముగ భరించుటను నేర్చుకొనుటయందు అమెరికనులుఅందరికంటె వెనుకబడినారు-ఇపుడుఅమెరికను సైనికులు అన్నిరంగములలోను పోరాడుచున్నారు. వారలు తిరిగి తమదేశమునకుపోయినతర్వాత తాముఉండి యుద్ధముచేసిన దేశములలోని ప్రజలనుగురించిఏమనకొందురు? దానినిబట్టిభవిష్యత్తులో కాలిబిడ్డరపడియుండును. ఇండియా, చైనా, రష్యాలకును ఆ భవిష్యత్తునందుచాలముఖ్యమైన జాతిత్రయము. ఒకానొక యూరపీయదేశీయులకంటెకూడ ఎక్కువముఖ్యమైనవారు.

## అరాచకచర్యలకు ద్వీపాంతరవాస శిక్ష

అక్టోబరు౧౬తేదినాడు ఇండియా ప్రభుత్వమువారు అరాచకచర్యలకు దండనవిధించు ఆర్డినెన్సు నొకదానిని జారీచేసినారు దానిప్రకారము ఎట్టి అరాచకచర్యనుగాని చేయువారలకును, శాసనమునకును, ప్రభుత్వాధికారులకునువిరుద్ధముగనుఆకారణముగను అరాచకవిషయములుగల ఏపత్రమును గాని చదివినవిపించినను, ముద్రించినను,ప్రకటించినను లేక మరిఏవిధమైనను నలుగురికి పంచిపెట్టినను ప్రచారముచేసినను అతనికి యావజ్జీవప్రవాసశిక్షనుగాని, రేదాగంపేండ్లవరకు ఖైదుశిక్షనుగాని విధించవచ్చును, దానితోకూడ జుర్మానానుకూడ వేయవచ్చును

అరాజకవిషయములుగలపత్రము శాసనసమ్మతిలేకుండ ఎవరివద్దయున్నను అతనికి ౧౪ఏండ్లవరకు ఖైదుశిక్షయు, జుర్మానాయు విధించవచ్చును.

## ఒరిస్సాలో అస్థిపంజరాలు నడచుచున్నవి

సికింద్రాబాదుపటుమాన బెంగాలులోను, ఒరిస్సాలోనుసంచారముచేసిన, నాస్జీముల్జీనోవాదాగారు బాలసోరుజిల్లాలోనిస్థితినిగురించి ఈ క్రింది విధముగా తెలుపుచు జాలేశ్వరులో తానుకెండ్లు స్త్రీని రంపెండ్లపురుషుని కొనచూసిరిలో నుండగా మాచి వారలనురక్షించుటకై ప్రతిమన్నించినను లేనిక్షత్రగాకపోయెనని. "జనుల దిగంబరత్వము ఘోరముగానున్నది. పెద్దవాండ్లకును గుడిసెండ్ల స్త్రీలకును పీరుములవరకేబట్టలున్నవి. యువతుల శరీరములపై ఒక్కబట్టయైనను లేదు" అని వారు చెప్పిరి.

## సూర్యాపేట

౧-౧౧-౫౩ఫ.

చ.౫౯-౧౨ ౫౯ఫ. రోజున సాయంకాలము గంటలకు హైద్రాబాదు నుండి నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభ అధ్యక్షులైన శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగారు, శ్రీయుతులు మాడపాటి హనుమంతరావుపంతులు, బొజ్జంనరసింహులు, ఉ. కేశవరావు, గోపాల్ రెడ్డి, యమ్.నారాయణరెడ్డి (నల్లగొండ)గార్లును మోటర్‌లారీలో దయచేసిరి. వీరు వచ్చిన గంటకాలములో శ్రీయుతులు రాంలింగారెడ్డి, గాజాదసత్యనారాయణగార్లు, శ్రీమతిలక్ష్మీబాయిగార్లు దయచేసినారు. ఆంధ్రమహాసభ అధ్యక్షులు ఆరాత్రి సుమారుగంటవరకు చందుపట్లనుండివచ్చిన రైతులతో వారికష్టములుమున్నగు వాటిని తెలిసికొనిరి. రైతులకుయిదివరకుఆంధ్రమహాసభ ఆర్డరులు కొన్నివిషయములలో తప్పుసలహాలుయిచ్చినందున, న్యాయస్థానములో అభియోగములునడచుచున్నవి అట్టివాటిని అధ్యక్షులవారు తీర్చిరి. మందుకు దేవేవిషయము కనుగొనవలసియున్నప్పను మూప్పారము నారాయణరెడ్డిగారి సలహాపొందుటకు సూచనచేసిరి.

రెండవనాడు ఆంధ్రభవనమునకు విరాళములు ప్రోగుచేయబడి సుమారు౭౨ ౦ రూకలు ప్రోగుకాబడినవి, వెంబడే ఉన్నదున్న పాఠశాలకు రెండు వేలరూపాయిలు ప్రోగుఅయినవి. అంతేగాక ఇక్కడ ఆంధ్రబాలికలపాఠశాలలో మిడిల్ తరగతులవరకు నడుపుటకు చందాలు ప్రోగుచేయబడినవి. శ్రీయుత వేంకటకృష్ణయ్య, అమృతరెడ్డిగారు చెరిసెలకు ౧౧౫రూపాయిలు చొప్పున విరాళము యిచ్చుటకు వాగ్దానములు చేసినారు. శ్రీసాంబయ్య సాహూ మున్నగువర్తకులు కలిసి నూరురూపాయిలవరకు నెలకు విరాళము జమచేయుప్రయత్నము సల్పుదుమని వాగ్దానములుచేసినారు. ఈపాఠశాల దీపావళి పండుగనుండి ప్రారంభించునట్లు గట్టిప్రయత్నములు జరుగుచున్నవి.

# బడాగ్లియో మిత్రమండలిలోనుండ నవర్హుడు

## అబిసీనియాచక్రవర్తి ఆక్షేపణ

అబిసీనియాచక్రవర్తియగు హెయిలీ సెలాసీ గారు లండనునుండి ప్రకటితమగు "న్యూసు క్రానికిల్" అనేపత్రికసంపాదకునికి అక్టోబరు ౧౬ తేదిన పంపించినఒకతంతిసందేశములో బడాగ్లియోగారి అధిపత్యమున ఇటలీనిమిత్రమండలిలో చేర్చుకొనుటతప్పని ఆక్షేపించినారు.

"శాంతిపరతులను ఆమోదించనంతకాలము ఇటలీనిశత్రువుకంటె అన్యముగా భావించజాలము. నేటియుద్ధములో దానిని మిత్రమండలిలో చేరి,సమానశత్రువుతో పోరాడుదానినిగ భావించుటకు అంతకుముందేమీలులేదు. ఏజాతి శాంతముగానుండి, తమపొరుగువారిపైకావలెనని యుద్ధమునుప్రకటించెనో ఆజాతితనపరాజయసమయమందు ఒక్కక్షణకాలములోనే నిత్రమండలివారితో చేరి సమానశత్రువుతో పోరాడుజాతియొక్క హోదాను అర్హతనుపొందజాలదు.

పరంజ్యా క్రమణపద్ధతిని మనసారద్వేషించు ఇటాలీయులనుతోడ్పడుటకు యధియోపియా రాజ్యము ఎల్లప్పుడును కోరికగలదే. కాని ఈవర్గములోని మారణములేని జన్మభూమిపై దండయాత్రచేసి ఘనకార్యము చేసితిమని భావించెదాముము, మా ఇండ్లను దగ్ధముచేసి, మా కుటుంబములను చంపివేసినవాడును, అభమెరుగని మా హృదయములకును, వారికులకును దుర్భరములైన నేరములను జేసెనంతకై ఒళ్లుమంటపుట్టించు ఉమార్షలు తమజాతీయుషాసిజమునకు చెప్పుకొనినవాడును, విషవాయుప్రయోగనిపుణుడునుఅగు, ఆమార్షల్ బడాగ్లియోను ఎంతమాత్రము రానీయజాలము"

---



# ఇండియాకు విదేశపు గోధుమలు వచ్చినవి

ఢిల్లీలో అక్టోబరు ౧౬ తేదిన ఆహారమహాసభలో ఇండియాప్రభుత్వపు ఆహారశాఖకార్యదర్శి మూడు నిర్ణయములను ప్రకటించెను. అన్నిరాష్ట్రములలోను ప్రధానమైన ఆహారపదార్థములధరలను శాసనముచేనిర్ణయింతురు. ప్రతిపట్టణమునందును ఆహారపదార్థములను జనులకు కొలతిలెక్కప్రకారముఇత్తురు. అవసరమనిరాష్ట్రములలో ప్రభుత్వములు తలచినపుడు అవిఆహారధాన్యములను తమ ఆజ్ఞచే సంపాదించుకొనవచ్చును.

ఆహారశాఖమంత్రియగు సర్-జె.పి శ్రీవాస్తవ గారు ఆసభలో ఆహారధాన్యములతో ఒకఓడవచ్చి అప్పుడేఇండియాయందలి ఒకరేవులోఆగినదనుకుంటున్నదనియు, మరొకఓడ రేపో మాపో రానున్నదనియు చెప్పిరి.



# ప్రభుత్వముపేరిట దొంగఆజ్ఞలు

## దొంగలు చిక్కుట

కరాచి, అక్టోబరు ౧౫

సింధురాష్ట్రమునో ప్రభుత్వకార్యాలయములందును, ఇతరకార్యాలయములలోను కొలువులయందున్నకొందరు గుమాస్తాలును, ఒకకాలేజీవిద్యార్థియుకలిసి ప్రభుత్వాధికారుల సంతకములవంటి సంతకములనుచేసి దొంగఆజ్ఞలనుజారీచేసి అనేకవిచిత్రచర్యలనుజరిపినసంగతి ఇక్కడ విచారణయందున్న ఒకఅభియోగమందు పట్టుపడినవిందితులలోనుండి అప్రూవరుగామారిన ఒకడు బయటపెట్టినాడు. ఈఅప్రూవరుసింధురాష్ట్రపు చీఫ్ కోర్టులో పూర్వముగుమాస్తాగానుండెను. గోప్యములైనపనులు అతనివశములో ఉంటుండెను, అందువల్లఅతనికి ప్రభుత్వప్రధానకార్యదర్శి మున్నగు ప్రభుత్వాధికారులసంతకముల నమూనాలు సులభముగాచిక్కుచుండెను. మరియు ప్రభుత్వమువారిస్టేషనరీసామాను, స్టాంపులు కూడ అతనికిసులభముగాఅందుబాటులో ఉంటుండెను

ఇట్లుండకుట్రలో చేరినవారలు అప్పుడప్పుడు సమావేశమగుచు దొంగఆజ్ఞ లనుజారీచేయుచుండిరి. ఈవిధముగా కాంగ్రెసు నాయకుడగు జయరాందాసు దౌలత్ రాంమున్నగు సెక్యూరిటీ ఖైదీలను సుక్కూరుజైలులనుండి కరాచిజైలులకుమార్చుటకు ఆజ్ఞలుజారీచేయబడినవి. కరాచిలో సభనొకదానినిఏర్పాటుచేసి, దానికిసింధురాష్ట్రపు నాలుగుమూలలనుండి ప్రభుత్వాధికారులచు రప్పించిరి. ఒకవార్తాపత్రికపై యుంచిన నిషేధమునతొలగించి ఇంకొకవార్తాపత్రికపైపెట్టిరి.'భప్రకాశ్'పై నిషేధమును పెట్టించిరి. ఒకటి దినోటుగొ గతనముకేసులో పోలీసుఅధికారినొకనిని అతనుచిక్కుటలేదని ప్రకటనచేసిరి.

ఒకనినిహుక్ అని ప్రకటించిరి. అఖరుకుపోలీసువారు పరిశోధనజేసి కుట్రనుకజాడ తీసినపుడు తానుమతనమిత్రులును తప్పించుకొనుటకు యత్నించినను వీలుకాకపోయెనని అప్రూవరు చెప్పెను.

### అరెస్టు

నాగపూరు, అక్టోబరు౧౮

హిందూస్తాన్ రక్తదళసభ్యుడగు వి.యస్. దండేకర్ గారిభార్య భారతదేశరక్షణ నియమాలలో ౧౨౯వ నియమమునను సరించి అరస్టుచేయబడినది

చందా వివరాలు
సంవత్సరము చందా 6 హాలి రూపాయలు
ఆరునెలలకు „ 3-10-0 „
బ్రిటిషిండియాలో సం॥చందా॥కల్దారు
విడి ప్రతిక 0-1-9
పాత పత్రిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominions
BEST MEDIUM — FOR — ADVERTISFMENT

Volu 18 — No46 | Published on every Monday and Thursday Hyderabad Dn | 21 - 10 - 1948


## వ్యాపారస్థులను గురించిన క్రొత్త ఆజ్ఞ
### సరకులను దాచుకొనుట

అసాధారణ లాభాలను రాబట్టుట నిషిద్ధములగును

అక్టోబరు 16 తేదిన ఇండియా ప్రభుత్వమువారొక క్రొత్త ఆర్డినెన్సును చేసినారు. దానిప్రకారము సరుకులనుత్పత్తి చేసేవాడుగాని, క్రయవిక్రయము ల వృత్తి సాగించువాడు గాని ఆఆర్డినెన్సులో తెలిపిన ఆకంటె ఎక్కువసరకును స్టాకుగా ఉంచుకొనరాదు. ఇతరజనులుతనసొంతవాడుకకు న్యాయముగా అవసరమైనంతకంటె ఎక్కువసరకును ఇండ్లలో నిలువచేయరాదు ఏసరకునుగాని దానిని అసలు ఉత్పత్తిచేయుటకైన ఖర్చుమీద సాధారణసమయములలోచేసే వ్యాపారమునందుపొందే లాభము కంటె ఎక్కువలాభము తీసికొని అమ్మరాదు

—

## సంస్థానాధీశులకు వైస్రాయి హితోపదేశము

ప్రజాహితపరిపాలన పద్ధతి ఉండవలెననుట

క్రొత్తఢిల్లీలో అక్టోబరు 18 తేదిన నరేంద్రమండలి సమావేశము జరిగినది. ఆసమావేశమందు వైస్రాయిలిన్లిత్గోగారు, తామధికారమును వహించు టకు పూర్వము చెలవుగైకొనునప్పటి ఉపన్యాసమును గావించిరి అధునికకాలపుస్థితులను నేటినానాదేశపరిస్థితులనుగమనించి, సంస్థానాధీశులు తమతమ సంస్థానాలలో ఆధునికములైన ప్రజాహితములైన పరిపాలనపద్ధతులను ఏర్పాటుచేయవలెననిరి. ఫెడరల్ రకపు రాజ్యాంగమును అవసరములనిపించు మార్పులతో ఇండియాలోఏర్పాటుచేసినచో భారతదేశమంతయు ఒక్కరాజ్యమువలె నడవగలదని తానిచ్చనమ్ముచుంటిననిరి. "రాష్ట్రములు, వాటి కెంతసంపదలున్నను, వాటిపరిపాలనయందు ఏ పద్ధతులు అవలంబించబడుచున్నను, వాటినిఒకదానితోమరొకదానిని కలుపుబంధములు ఎంతపర్భలములైనను, ఆరాష్ట్రములు ఒక్కపెద్దరాజ్యములోనిభిన్నఖండములుగ నుండవలసినదేగాని అన్యథాయుండజాలవు. ఆబంధములకుపటుత్వము, ప్రయోజనములేకపోజాలవు." అని వైస్రాయిగారు చెప్పిరి.

కొందరు శత్రువుల ప్రతినిధులు శత్రు జలాంతర్గామినౌకనుండివచ్చి ఒకభారతీయసంస్థానములోని సముద్రతీరప్రదేశమునదిగగావారలనువెంటనే పట్టుకొంటిమని వైస్రాయిగారు తెలిపిరి.

"జాగీర్దారులును, థాకూరులును ఇప్పటివలెనే సగముస్వతంత్రముగా పరిపాలనసాగించుచుండ దలచుచున్నారు. ఆ పద్ధతివారికున్న కొద్ది సంపదకుతగినదికాదు. అందువల్లవారలు పాలించు ప్రదేశములయందలి జనులయొక్క క్షేమములకు అదితప్పక హానికరమైనది. అట్టి జాగీర్దారులకును, థాకూరులకును కాలము అనుకూలముకాదని నేనుస్పష్టముగా చెప్పవలసియున్నది" అని వైస్రాయిగారనిరి.

"యుద్ధానంతరము మంచివ్యవస్థను దేశములో ఏర్పాటుచేయు విషయమున ఇండియాప్రభుత్వమువారినిర్ణయములు చాలావరకుజరిగినవి. ఆనిర్ణయములయందు మీసంస్థానములలో సహకారము పొందుటకుకూడ సంపూర్ణమైన ఏర్పాటులున్నవి. సమర్థులైనమీమంత్రులలో అనేకులు ఈసంతర్ప్తము సపర్పాటుచేయబడుచున్న ఉపసంఘములలోచేరుకొనబడియున్నారు" అనియులిన్లిత్గో వైస్రాయిగారుతెలిపిరి.

ఇప్పుడుదేశములో రాజకీయ పరిస్థితులనుగురించివైస్రాయిగారు ప్రసంగించనేలేదు. ఇందువల్ల గాంధిమహాత్మునకు మున్నగుకాంగ్రెసు నాయకులవిడుదలనుగురించి కొన్నిపత్రికలలో ప్రకటితములైన వదంతులు నిరాధారములని తెలిపోయినవి.



## ఇండియాకు క్రొత్తవైస్రాయి దంపతులరాక

క్రొత్తఢిల్లి, అక్టోబరు 19

భారతదేశపు వైస్రాయిగ నియుక్తుడైన వేవెల్ గారు తమసతితోను, సంకేతఉద్యోగులతోను ఇండియాకు వచ్చి చేరినారు

## భర్తలసత్యాగ్రహానికి ప్రతిసత్యాగ్రహము

—

అకోల, అక్టోబరు 18

ఇపుడు కేంద్రశాసనసభయగు ఢిల్లీఅసెంబ్లీలో హిందూస్త్రీలకు సౌకర్యములనుకలిగించే ఒకచిత్తు శాసనము చర్చలోనున్నది. దానిని శాసనసభలో చర్చింపనీయకుండ చేయుటకై ముగ్గురుసనాతనులు అసెంబ్లీభవనముఎదుట నిరశనసత్యాగ్రహముచేయదలచిరి. అందుపైవారలభార్యలు దానికి ప్రతిక్రియగా నిన్నహనుమాణఅర్తివద్ద ప్రార్థనచేసి తాము ఇంటివద్ద నిరశనవ్రతమును ప్రారంభించినారు. దేశములోని వివేకవంతులందరును తేనిని హిందూస్త్రీలకు చిరకాలమునుండి జరిగిన అన్యాయమును పోగొట్టుదానిని మెచ్చుకొనినారో అట్టిశాసనము కొఱకై తమభర్తలు సత్యాగ్రహముచేయుటలేదని మాటయిచ్చునంతవరకు తాము ఆనిరశనదీక్షను సాగింతుమని ఆస్త్రీలుచెప్పినట్లుగా "పయనీర్"అను పత్రికయొక్క ఫైజాబాదువిలేఖరి తెలిపినాడు.-
అ. ప్రె.

## మదరాసులో వఱదల వల్ల గొప్పనష్టము

అక్టోబరు 17, 18 తేదులలోమదరాసునగరమందు వర్షములవల్లవచ్చినట్టివఱదలు ఇదివరకెన్నడువచ్చియుండలేదు. దానివల్ల గొప్పనష్టముకలిగినది. నగరమధ్యమందున్న కూంటునోడ్డు పూర్తిగా వెల్లువలోపడెను. అక్కడజనులు వారల ఆస్తులు నీటిపైకొట్టుకొనిపోవుట జరిగెను. కూవంనదియందు గుడిసెలతలుపులు కొళ్ళు, ఇంకనుఇతరమైనఇంటివస్తువులు తేలియాడుచుండెను. కాబట్టి దానినానుకొనియుంటే ప్రదేశములలో చాలా గొప్పనష్టము కలిగియుండవచ్చును. చింతాద్రిపేటలో ఉన్నట్టియు కల్లువలో కొట్టుకొనిపోయినవి.

అక్టోబరు 18 తేదివరకు రెండుమరణములు లెక్కకువచ్చెను. మొత్తముఎందరు చచ్చిరో, గాయపడిరో తెలియదు.

చెంగల్పట్టుజిల్లాలో 100 చెరువులు అతివృష్టి వల్లపాడైనవి.

— —












Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S. Prathap Reddy, B.A., B.L.